# చిత్తపరిశుద్ధి





కర్త :

'సాధనరహస్య,' 'సర్వ సిద్ధాంత సౌరభా' ది

బహు గ్రంథకర్తలు

శ్రీరామకృష్ణాశ్రమములు (బాపట్ల & భీమునిపట్నము)

సంస్థాపకులు

పరమహంస పరివ్రాజకాచార్య

## శ్రీ అనుభవానందస్వామి





ప్రకాశకులు :

## శ్రీ అనుభవానంద గ్రంథమాల

బాపట్ల-522 101 (గుంటూరుజిల్లా)

భీమునిపట్నం-531 163 (విశాఖజిల్లా)

సర్వహక్కులు : ప్రకాశకులవి

నాలుగవ కుసుమము

చతుర్థ ముద్రణము : 1986

వెల : 2-00



ప్రతులకు :

1. శ్రీ అనుభవానంద గ్రంథమాల,
బాపట్ల - 522 10

2. పరమహంస కార్యాలయము
భీమునిపట్నము - 531 163

3. శ్రీ శారదా ప్రింటర్స్
బాపట్ల - 522 101

# ఉపోద్ఘాతము

మనస్సును ప్రధానముగా కలవాడు మానవుడు. ఆ మనస్సును సద్వినియోగమొనర్చుకొనిన మానవుడు, ఆధ్యాత్మికముగ ఉన్నత స్థానమును గడించి, మహాత్ముడై విరాజిల్లును. అట్లుకాక ఆ మనస్సునే దుర్వినియోగము గావించుకొనిన, తాను చెడి, సంఘమును చెరచి సంఘ వినాశమునకు కారణమగుచున్నాడు. సత్కర్మ, సద్యోచన, సద్విచారణ, సద్గ్రంథశ్రవణ, సత్సాంగత్యములతో సత్పురుషుడు కావలయునను భావన, సంఘమధ్యమున జీవించు ప్రతివ్యక్తికి అత్యవసరము. 'నావలన సంఘమునకు హాని కలుగరాదు.' అను భావనతో మెలగగలిగిన వ్యక్తి ఎంత అదృష్టవంతుడు! అప్పుడు లోకమున సుస్థిర శాంతియే ప్రవహించును.

మానవుడు సంఘజీవి తన వ్యక్తిత్వమును కాపాడుకొనుచు, సంఘమున జీవింపవలయునుగదా! ఇది చాల కష్టము. స్వాధీన మనస్కునికే యిది సాధ్యము. మనస్సునుగురించి సంపూర్ణముగ గ్రహించి, ఆ మనస్సును లౌకిక విషయములనుండి మరల్చి, ఇంద్రియముల వశపరచుకొని, విరాగసంపన్నుడు కావలయును. ఆ వైరాగ్యము నిశ్చలత్వము నొందినప్పుడే నిత్యశాంతి,

మనో నిగ్రహము లేనిచో శాంతి అలభ్యమని శ్రీ అనుభవానంద స్వాములవారు యీ 'చిత్తప్రబోధ'ను వ్రాసియున్నారు. ఈ గ్రంథమున, మనోలక్షణములు, లౌకిక విషయ అనిత్యత్వము, మనోప్రబోధము, మనో నిగ్రహవిధానము, అనేక సాధన విషయములు సుస్పష్టముగ వివరింపబడినవి. ఇది సాధకులకు అత్యంతావశ్యకము.

మాతాజీ త్యాగీశానంద

ఓమ్

# చిత్తపరిబోధ

## శ్రీ సదసుభవానందకృతము

ఉ॥ శ్రీగుణశోభితంబు, గురుసేవిత సాధన సంయుతంబు, దు
ర్యోగ నిబద్ధమానవ సముద్ధరణైక విశేషమున్, మహా
1 రాగపరీతసంసృతివిరాగవిధానము, జ్ఞాన బోధయున్,
త్యాగవిభూతికాకరము నాబడు దీని బఠింపు చిత్తమా!

ఓ చిత్తమా! శ్రీ గుణములతో శోభించి, గురువులచే సేవింపబడిన సాధనలతో కూడుకున్నదియు, దుర్యోగముతో కూడిన మానవ సముద్ధరణ విశేషమును, మహారాగముతో నుండెడి బంధ వైరాగ్య విధానమును, జ్ఞాన బోధయును, త్యాగ నిలయమును అయిన యీ చిత్తపరిబోధమును చదువు.

మ॥ నిను గుర్తింపగలేనటన్న తలపుల్ నీకుండెనేమో, భ్రమం
చనెడన్; పాలను ద్రావు పిల్లి యిటులే యాలోచనల్ సేయచే
2 కనులన్ మూయుచు, 'నీవు కోతి'వని పల్కంగదె నీ యాసనం
బును వీక్షించుచు; గాన వ్యర్థ తలపుల్ బోనాడుమా చిత్తమా!

ఓ చిత్తమా! అది భ్రమ. కళ్లు మూసుకుని పిల్లి పాలను త్రాగినట్లుగా, కోతిని చూచి నీవు కోతివని పలికినట్లుగా నిన్ను గుర్తింపలేనను భావన నీకున్నదేమో; అది ఉట్టిభ్రమ.

చ॥ చెడు గలుగంగ గారకుల జేయుదువన్యుల నీవు; మంచి గ
ల్గెడు నపుడన్న నీయదియె కీర్తియ నా బ్రకటింతువిట్టి దీ
3 పుడమి జనించు బూర్వమున బుట్టెను నీకు; బరాయివారలన్
దడయకదూరు'టే మతము; తప్పుడుమార్గముకాదె చిత్తమా!

ఓ చిత్తమా! నీచెడ్డకు యితరులను కారణంగా చేస్తావు. మంచి కలిగితే ఆ కీర్తిని నీదిగా చాటుకుంటావు. ఈ విపరీత లక్షణం నీకు యీ లోకంతోపుట్టి ఉంటుందేమో! ఇతరులను వెంటనే దూషించటమే నీమతం. ఇది తప్పుసుమా!

శా॥ పై జూపుల్ గనగల్గుచో జగతి నిన్ బట్టంగ శక్యంబె? నీ
రాజత్వంబున నెత్తికెక్కు గనులున్ లక్షింతువే పెద్దలన్?
4 ఈ జాడ్యాంధత నాశమయ్యెదవిదే దృష్టి ప్రభావంబునన్
బూజాపాత్రత నొందిరన్యులిది నీ పుణ్యంబహో చిత్తమా!

ఓ చిత్తమా! అటుకాక నీవు ఊర్ధ్వదృష్టి పొందితే యిక నిన్ను పట్టుకొనగలమా? నీ రజోగుణంచేత కళ్లు నెత్తికెక్కుతాయి. ఇక పెద్దలను లక్ష్యపెట్టుతావా? ఈ రోగంచేత అంధకారం ప్రాప్తించి నశించిపోతావు. కాని యీ దృష్టి ప్రభావంచేతనే అనేకమంది పూజాయోగ్యతను సంపాదించారు. ఆహా! ఇది పుణ్యంసుమా!

శా॥ ఈరీతిన్ గన నూర్ధ్వదృష్టియు నధోదృష్టుల్ ప్రభాయుక్తు
జేరన్ జేయు యశోవిశేషమును, నీ ఛిద్రత్వమేమో! యిపే
5 వైరంబున్ గొని నిన్ను దుర్గతులలో వైచున్ గదా! దీని కా
ధారంబెయ్యది నీదు కర్మయెసుమా! తథ్యంబుగా జిత్తమా!

ఓ చిత్తమా! పై విధంగా ఊర్ధ్వదృష్టి అయినా, అధో దృష్టి అయినా ఉన్నత స్థితులను అందిస్తాయి. కాని నీరంధ్రాన్వేషణ కారణంగా యివే నిన్ను దుర్గతిని పొందింప చేస్తున్నవి. దీనికి కారణం ఏమిటో తెలుసునా? యధార్థంగా ఆలోచిస్తే నీ కిర్మయేసుమా!

మ॥ విషయాళిన్ గని సౌఖ్యసంపదలలో బెంపొందగా జేయు నా
మిషలో మున్గిన నాశమౌదువుసుమా! మేధామతిన్ జూచుచో
6 విషసర్పంబుల గౌగలింతలివి యీవెర్రెట్లు నిన్ బట్టె? నీ
విషయంబీవు తలంపవే! ఎరుగవే! వింతయ్యెనే చిత్తమా!

ఓ చిత్తమా! లౌకిక విషయాలను చూచి, సుఖసంపదల నభివృద్ధి చేయ సంకల్పించి అందు మునిగినచో నశించిపోవుదువు. బుద్ధిని ఉపయోగించి చూచినచో యీ రహస్యాన్ని గ్రహించుకుంటావు. ఈ విషయాలలో పొందు కోరటం విషసర్పాలను కౌగిలించుటవంటిదని గ్రహించుకో! నీకు యీ వెర్రి ఎందుకు వచ్చింది? నీకు తెలియదా! ఎప్పుడైనా యీ విషయం ఆలోచించావా!

చ॥ ఇతరుల దోషమెంచి తమ హేయగుణంబుల బూతవేయు ప
ద్ధతి ధరయంతటన్ సహజధర్మము, దీనినె యాశ్రయింప నీ
7 గతియు నిజంబు దుర్గతియ, కాన యథార్థమెరింగి యోచనా
రతి స్వపరత్వములన్ దుడిచి రంజిల గల్గదె ముక్తి చిత్తమా!

ఓ చిత్తమా! లోకంలో ధర్మమేమిటో తెలుసునా? ఇతరుల షాలను ఎత్తి చూపించటం. తమ దోష సమూహాన్ని

మంచిగా చూపింప యత్నించటం. ఈ పద్ధతినే నీవు ఆశ్రయించాలని నీఉద్దేశమైనచో నీకు దుర్గతిమాత్రమే లభిస్తుంది. కాబట్టి యథార్థం తెలుసుకో! ఆలోచించుకో! స్వపర భేదాన్ని దూరం చేస్తే ముక్తి కలుగుతుంది సుమా!

మ॥ పసిబాలుం గని స్వీయ దోషముల నాపాదింతురా పాపపై
దొంగుల్లేని మహాత్ములట్లు జగతిన్ దోషఘ్నులెల్లప్డు, యా
8 పసికూనల్ భరియింత్రు వాని క్షమతో బ్రాయశ్చిత్తంబులంచెంచి; దీ
ని సగర్వంబుగ జూచుచుందురితరుల్ నిశ్చింతతో జిత్తమా!

ఓ చిత్తమా! ఈ లోకంతీరు చూచావా! పసిబిడ్డలనుచూచి, మన దోషములను ఆ పసికూనలకు అన్వయించినట్లుగా, దోషరహితులైన మహాత్ములనుకూడా అదే దృష్టితో చూస్తూ ఉంటారు దోషఘ్నులు. పాపం! ఆ పసిబిడ్డలు 'ఇది మా పూర్వ జన్మప్రాయశ్చిత్తం' అని ఓర్పుతో భరిస్తారు. యీవిధంగా పసివారిని, మహాత్ములను బాధిస్తూ ఉంటే నిశ్చింతగా యితరులు చూస్తూఉంటారు.

శా॥ ఏ సూత్రంబున వారి కర్మఫలితంబీ పావలన్ ముంచు! నే
దోసంబుల్ గనరాని వీరు భువిలో దుర్మార్గులౌటెట్లు? అ
9 ధ్యాసన్ రజ్జుగుగాదె సర్పముగ, నా తాప్రిటిన్ భ్రమన్ గొట్టషే
ఆ సూత్రంబు నచింత్యమౌ నిదియు భావాతీతమౌ చిత్తమా!

ఓ చిత్తమా! ఆ పసిపావల కర్మఫలితం వారిని ఏవిధంగా ముంచుతుంది? ఏదోషాలను చేయని మహాత్ములు యీలోకంలో దుర్మార్గులు ఏవిధంగా అవుతున్నారు? దీనికి సూత్రం ఏమిటి?

భ్రాంతి సమయంలో త్రాడునుచూచి పాముగా భావించి, ఆత్రాటిని భ్రాంతిలో బాధిస్తున్నాముగదా! అది అచింత్యం, భావదూరం! వేరే ఏమి చెప్పగలం!

చ॥ తమ ప్రతిబింబమున్ గనుచు దర్పణదోషమటంచు దానిపై
దమ కుగుణాల ద్రోసి, కట! దర్పణనాశము జేయ న్యాయమే?
10 తమమున నజ్ఞమానవుల ధర్మము లోకమునందు స్వీయ దో
షముల బరీక్ష సేసి గనజాలరు మూఢులుగాదె! చిత్తమా!

ఓ చిత్తమా! చూచావా? అద్దంలో తమ ప్రతిబింబాన్ని చూచి, తమ దుర్గుణాల నా దర్పణమునకు ఆపాదించి, ఆ అద్దమును నాశనం చేసినట్లుగా తమోగుణావిష్టులైన అజ్ఞమానవులు గూడ తమ దోషముల గ్రహింపలేరు! ఇదే లోక ధర్మం! వీరు ఎంత మూఢులో గ్రహించుకో!

ఉ॥ దీని వరింత్రు పండితులు, దీనికి బామరులెల్ల దాసులే
దీనగదా గృహస్థులు, యతీశ్వరులైన జరింత్రు, గాన లో
1 కాన శరణ్యమేది గుణగణ్యులకింక? పరాత్పరుండనన్
మౌనము! కాన యుక్తమగు మౌనము వీరికిగూడ చిత్తమా!

ఓ చిత్తమా! లోక పద్ధతినే అనుసరిస్తారు పండితులు! ఈ లోక విధానానికి పామరులందరు దాసానుదాసులే; దీన్నే గృహస్థులు ఆచరిస్తారు ఇక గుణవరేణ్యులైన వారికి యీ లోకంలో ఏది శరణ్యం? భగవంతుడైన పరాత్పరుడందామా మౌనం! కాన యీ ఉత్తములకుకూడ మౌనమే శరణ్యమో సే!

ఉ॥ నమ్మినవారి కుత్తుకల నర్కెడువాఁడె లోకమంచు చి
త్తమ్మున నేర్వలేక ప్రతి ధర్మవిహీనుని విశ్వసించుచో
12 గ్రమ్మర గొంతుకోతల గాఁతువు దాని ఫలంబుగా, యథా
ర్థమ్ముగ లోకధర్మమిదె ప్రస్తుతకాలమునందు చిత్తమా!

ఓ చిత్తమా! ప్రస్తుతకాలంలో లోక ధర్మం ఏమిటో తెలుసునా? 'నమ్మినవారి గొంతుకల కోసేదే లోకం' అని తెలుసుకో! ప్రతి ధర్మహీనుని 'నీవు నమ్మితే నీవుకాడ' అదే దుష్ఫలితాన్ని అనుభవిస్తావు. ఇది యథార్థంసుమా!

శా॥ ధర్మాధర్మ విచక్షణంబనెడు సద్ధర్మంబు శూన్యంబు,దు
ష్కర్మాస్ పగ్నత మెండు, స్వార్థము విశేషాధిక్యతన్ గాంచె, లో
13. పర్మంబుల్ ఎహుళంబు, సత్యనిరతుల్ మాయంబుగా నున్న దు
ష్కర్మాగారము లోకమందెటుల వాసంబుందువో! చిత్తమ

ఓ చిత్తమా! ఈ లోకవిషయం చెప్పుతాను. విను. ధర్మాధర్మ విచక్షణలేనిది యీ లోకం, సద్ధర్మం శూన్యం. దుష్టకర్మలలో ఆసక్తి అధికం స్వార్థం విశేషంగా ఉన్నది. లోపల కల్మషాలు, సత్యనిష్ఠులుగా కనిపించువారుకూడా మాయకు స్వాధీనులుగా ఉన్నారు. దుష్కర్మలకు ఆలవాలము. ఇటువంటి యీ లోకంలో నీవు ఎట్లా నివసిస్తావో!

శా॥ ఏ దిక్కున్ బరికించినన్ గటగటా హింసాస్వరూపంబులే
నీ దృశ్యంబులు! ప్రాణహానిగద ప్రాణిన్ నిల్పు నారీతి గ
14 ట్టా! దుఃఖాకృతి, మోసగింపునన దట్టంబైన లోకంబులో
నే దారిన్ మనబూనితో? జగతినిన్ హింసింపదే చిత్తమా?

ఓ చిత్తమా! అయ్యో! ఎటుచూచినా యీ దృశ్యాలన్నీ హింసతో కూడుకొన్నవేగదా! ప్రాణరక్షణలో కూడ ప్రాణహానియే గదా! అయ్యో! దుఃఖరూపమే! వంచనలకు నిలయమైన యీ లోకంలో, నీవు ఏ విధంగా ఉంటావో? లోకం నిన్నుమాత్రం బాధించదా ఏమిటి?

ఉ॥ ఇప్పుడు స్నేహితుల్, మతివిహీనత విస్మృతి నిన్ను ద్రుంపగా
జొప్పడ యత్నముల్ సలుపు క్షుద్రులుగూడ నిజంబు వారలే,
15 ఇప్పగిదిన్ దురాత్ములకు నిల్లిది లోకము, దీన నుంట నే
తప్పుడు వారి బారిఁబడి తల్లడమందుదువో కదా! చిత్తమా!

ఓ చిత్తమా! ఇప్పుడు స్నేహితులుగా ఉన్నవారే, నీకు మతి చలించినచో నిన్ను నాశనం చేయటానికి యత్నించే క్షుద్రులు అనే యథార్థాన్ని గ్రహించుకో! ఈ విధంగా దుర్మార్గులకు పుట్టినిల్లు యీ లోకం! ఇట్టి యీ లోకంలో ఉంటూ, వారి చేజిక్కి, ఏ విధంగా బాధలను అనుభవిస్తావో ఆలోచించుకో!

ఉ॥ ఇంతటిదేగదా జగతి, హీనప్రబుద్ధుల కాశ్రయంబు, నా
వంతయు న్యాయమే గనక స్వార్థపరత్వము నాశ్రయించుటన్
16 ఎంతటి నీచ కార్యమును నేనియు జేయగ జంకకుండు, నీ
స్వాంతమునందు శాంతి నెటులార్జనసేతు జగాన చిత్తమా!

ఓ చిత్తమా! ఈ లోకంతీరు చూచావా? నీచబుద్ధులకు ఆశ్రయం. న్యాయం శూన్యం. స్వార్థపరత్వంలో పూర్తిగా మునిగి ఎటువంటి నీచ కార్యాన్నైనా చేయటానికి వెనకాడదు. ఇదే ప్రపంచం. ఇటువంటి లోకంలో ఉన్న నీవు స్వాంతంలో శాంతిని ఏవిధంగా సంపాదిస్తావో!

ఉ॥ కాని యథార్థ దోషముల గాంచి విమర్శన సేయ మంచిదే,
కాని యబద్ధముల్ బలురకంబులుగా సృజియించి ద్వేషమై
17 వానిని జాటజూచినను బాధ రవంతయులేదు, సూక్ష్మమై
లోన గుబుద్ధి యున్న, నది లోన నశించునుగాదె చిత్తమా!

ఓ చిత్తమా! కాని లోకంలో సద్విమర్శనలేదు. యథార్థ దోషముల జూచి విమర్శించిన మంచిదేగదా! కాని లేనివి సృష్టించి, ద్వేషంతో అనేక విధాలుగా ప్రచారంచేసినా బాధలేదు. ఒకవేళ సూక్ష్మరూపంలో సూక్ష్మంగా దుర్బుద్ధి ఉంటే అదిగూడ నశిస్తుందిగదా!

మ॥ ఎటు బోజూచిన భేదభావజములౌ హేయంపు పోరాటముల్
బటుదీవ్రంబుగ బ్రజ్వలించి పటనా ప్రావీణ్యమున్
జూపి, యెం
18 తటి సిద్ధాత్మునినైన నూ వుటలు ప్రత్యక్షంబు, లోకంబు బు
ట్టుటకున్ బూర్వమె భేదముల్ గలుగుచాడ్పున్ దోచనో చి.

ఓ చిత్తమా! బాహ్యప్రపంచంలో ఎక్కడికైనా వెళ్ళి ఉండవలెనని భావించవద్దు. ఎక్కడికి వెళ్ళినా భేదభావములే! దానివలన హేయమైన తగవులే; ఆ తగవులు తీవ్రంగా పరిణా

మించి, చక్కగా నటించి ఎటువంటి మహాత్ముని అయినా క్రిందికి త్రోయటం సుస్పష్టంగా కనిపిస్తున్నది. బహుశః యీ భేదాలు యీ లోకం పుట్టటానికి ముందే ఉన్నవేమో అనే భావన కలుగుతుంది.

ఉ॥ ఆకలిగొన్నవానికిసుమంత భుజింపగ నిచ్చినన్ గుణం
బే కనబోక దృప్తిపడి ప్రేమను జూపును గాని. బొత్తిగా
19 నాకలి లేనివానికి బ్రియంబున భక్ష్యములిచ్చినన్ దినం
బోక, దొసంగులెంచుటకు బూను ధరాతలమందు చిత్తమా!

ఓ చిత్తమా! ఈ లోకం పోకడను గ్రహించుకో! బాగా ఆకలిగా నున్నవానికి కొద్దిగా భోజనం పెట్టితే, ప్రేమతో తృప్తిగా భుజించి, దోషాలను ఎంచడు. ఆకలి లేనివానికి ప్రేమతో మంచి భోజనం ఏర్పాటుచేసినా, తినకపోగా దానిలోగల లోపాలను చూపించ ప్రయత్నిస్తాడు. ఇది లోకంతీరుసుమా! (ఆకలిగొన్నవారికే భోజనం యిష్టంగా ఉంటుంది. అదేవిధంగా ఆధ్యాత్మిక తాపం కలిగినవారికే ఆధ్యాత్మిక జీవితం ప్రియంగా ఉంటుంది.)

ఉ॥ బంధము బంధమంచు బలుభంగుల వేదన నొందనేల? సం
బంధములేని నీకు గన బంధము దుర్లభమెచ్చటైన, నీ
20 బాంధవ భావజాలములె బంధన హేతువులౌను, కావునన్
బాంధవ భావనాశనమె బంధవిముక్తి నొసంగు చిత్తమా!

ఓ చిత్తమా! 'బంధం బంధం' అని ఎందుకు వేదన చెందుతావు? సంబంధంలేని నీకు బంధం ఎక్కడున్నది?

బంధువులతో పెట్టుకొనిన భావ సమూహమే బంధనానికి కారణము. కాబట్టి బంధు నాశనంకాక భావ వినాశమే బంధవిముక్తిని కలిగిస్తుందిసుమా!

శా॥ బంధంబన్నది నీదు దుర్బలత నా భావంబులన్ ద్రోసి, నీ
యంధత్వంబున వారి వీరి ననుటల్ వ్యర్థంబు, యోచించి, యా
21 బంధధ్వంసక సూత్రమాత్మబలమున్ బ్రాప్తంబుగా జేయ, నా
బంధాతీత యథార్థ సంస్థితులు సంప్రాప్తించునో చిత్తమా!

ఓ చిత్తమా! అసలు బంధం అనగా ఏమి? బంధం అనేది నీదుర్బలత్వం. ఆ బలహీనతను అంగీకరింపక గుడ్డిగా వారిని, వీరిని అనుకోటం వ్యర్థం. ఆలోచిస్తే ఆ బంధ నాశనసూత్రం ఆత్మబలంలో ఉన్నది. ఆ ఆత్మబలాన్ని పొందితే ఆ బంధాతీతమైన యథార్థ ఆత్మ సంస్థితులు సంప్రాప్తిస్తాయిసుమా!

శా॥ భావంబందు ఘటిల్లు బంధమను భావంబున్ విలోకించి, యే
భావంబుల్ గనకుండ నుండుటయు సంభావ్యంబు గాకుంటచే
22 భావాతీత గుణస్థితిన్ గనుచు భావంబుంకి లేనట్లు, లో
భావింపంగలవేని బంధరహితంబౌ సత్యమే చిత్తమా.

ఓ చిత్తమా! 'భావంలోనే బంధమున్నది' అను భావాన్ని గ్రహించుకో, ఏ భావం లేకుండా ఉండటం అసాధ్యం కాను, అందుచేత భావాతీతమైన స్థితిని పొంది, భావంఉండి, లేనట్లు భావించితే యథార్థంగా బంధరాహిత్యం కలుగుతుందిసుమా!

శా॥ విన్నాడన్ భవదీయ తత్త్వమును సద్విద్యాధికుల్ సెప్ప, పై
గన్నారన్ గనినాడ నీ వడత, లోకంబందు విన్ గూర్చి నే

23 నెన్నో వింటినిగాని నా విషయమందీవిట్లు చాంచల్యపై
యున్నావా? ఇక ధ్వంసమౌదువునుమా! యున్మత్తవా
చిత్తమా!

ఓ చిత్తమా! విద్యాధికులైనవారు నీ తత్వమును చెప్పగా విన్నాను. మరియు నీ నడతను కన్నులారా చూచాను. నిన్ను గూర్చి లోకంలో చాలా విన్నాను. కాని అదేవిధంగా నా విషయంలో ఉన్నచో నాశనం అవుతావు. పిచ్చిదానివా?

శా॥ లోసంగల్గు విముక్తిగాంక్షయుతకల్లోలాల నట్లుంచి, లో
కానం గల్గు విరుద్ధ తత్త్వములతో గాట్లాటలన్ మున్గి, సు
24 స్థానంబున్ విడనాడగా తగునె విశ్రాంతస్థితుల్ వోపగా!
గానన్ లెమ్ము, నిజంబెరుంగుమెద నింకైనన్ గటా!
చిత్తమా!

ఓ చిత్తమా! లోపల ముక్తికొరకు కలిగిన కాంక్షలతో కూడిన కల్లోలాలు అట్లా ఉండగా, లోకమున గల విరుద్ధ తత్త్వములతో పోట్లాటలో మునిగి, ప్రశాంతత పోగొట్టుకొని మంచి స్థానమును పోగొట్టుకొనతగునా? కాన లే! ఇకనైనా నిజాన్ని గ్రహించు.

॥ నిను దరియింపజేయు పని నే దలదాల్చుచు వచ్చినాడ నా
దు నెలవు వీడి, నీ బహుళ దుస్థితి గాంచి దరించపజేయగా,
2 వినుము పరాకులేల? చెడువృత్తి జరింపక నాదు మార్గమున్
గొనుము పవిత్రమాటకిది గొప్ప విశేషము వెర్రిచిత్తమా!

ఓ వెర్రిచిత్తమా! నీ దుస్థితిని గాంచి, తరింపజేయుపనిని ముఖ్యముగా పెట్టుకొని వచ్చానుసుమా! విను, పరాకు ఎందుకు? చెడువృత్తిలో చరింపక నా మార్గాన్ని స్వీకరించు. పవిత్రం కావటానికి యిది ఒక గొప్ప అవకాశము.

మ॥ వినవా! కొంచుము, సర్వదుఃఖమయ సంవృత్యుక్తమై, బంధమై
తనుధర్మంబులకాలవాలమగు స్వార్థత్వాబ్ధిలో మగ్నమై
చను లోకంబున మున్గి భ్రాంతి యను పాశానన్
26 దగుల్గొంచు నా
శనమైపోదువు, కాన మాట వినవే సత్యార్థిపై చిత్తమా!

ఓ చిత్తమా! చూడు! నామాట వినకున్నచో, సర్వదుఃఖముల తోకూడినదై, బంధమై, శారీరధర్మములకు నిలయమైన స్వార్థ సంద్రమున మునుగుచు పయనించు లోకమున మునిగి, భ్రాంతి అను పాశాలలో దగులుకొని నాశనం అవుతావు. కాన సత్యస్వరూప గ్రహణార్థిపై నామాట విను.

మ॥ విను నే వెర్రిగ నాశ్రయించినచొ దుర్నీతుల్ మెడన్ జుట్టిన
జెనటిన్ జేయుచు నీవు చచ్చెదవు; నన్ జేపంగ నీవున్నచొ
27 నిను నాత్మైక్యము నొందజేసి పిదపన్ నే నాత్మలో లీనమౌ
దును రమ్మా. వినుమా, యిదే చెడకుమా దుర్బుద్ధిపై
చిత్తమా!

ఓ చిత్తమా! నేను వెర్రివాడినై నిన్ను ఆశ్రయించినచో, అనేక చెడు గుణముల నామెడకు చుట్టి, నను మూర్ఖునిగా జేసి,

నీవుకూడా చెడిపోయెదవు. కాని నీవు నన్ను జేరినచో నిన్ను
ముందుగా ఆత్మలో లీనము గావించి, తరువాత నేను ఆత్మైక్య
మును పొందగలను. దుర్బుద్ధితో చెడిపోవద్దుసుమా! రా!
నా మాట విను.

ఉ॥ తప్పుల నెంచువారికిది స్థానము లోకము, నీవటన్న నీ
తప్పుల నున్న జేయగల దారి గవేషణ సేయుచుంటి, వీ
28 తప్పులమాత్రమే గనెడు దాతలమధ్య చరించితేని నీ
తప్పులు వోయి నీ విమలతత్త్వము భాస్వరమౌను
చిత్తమా!

ఓ చిత్తమా! ఈ లోకంలో తప్పులను ఎత్తి చూపించే వారికే స్థానం. నీవో! తప్పులను పోగొట్టుకోవాలనే ప్రయత్నం చేస్తున్నావు. నీవు తప్పులమాత్రమే చూచేవారిమధ్య సంచరిం! చితే నీ తప్పులుపోయి, నీ యథార్థతత్త్వం ప్రకాశిస్తుందిసుమా

శా॥ దీనన్ సౌఖ్యము గల్గుచున్నదని నీ తీర్మానమై యున్నచో,
గానంరాదె క్షణంబులో నమసి దుఃఖాక్రాంతులన్ జేయుటల్.
29 గానన్ శాశ్వతసౌఖ్యమొందగల మార్గంబొండు బోధింతు, నా
యానల్ నల్పుము, సత్యమారయుము, సమ్యగ్దృష్టితో
చిత్తమా!

ఓ చిత్తమా! ఈ లోకంలో సౌఖ్యం లభిస్తుంది అనే నీవు తీర్మానించినచో, ఆ సుఖం క్షణంలో దుఃఖంగా మార్పు చెంది, దుఃఖాక్రాంతులను చేస్తున్నదిగదా! అందుచేత శాశ్వతమైన

సుఖాన్ని పొందే మార్గాన్ని నీకు బోధిస్తాను. నా ఆజ్ఞలను పాటించు. సత్యదృష్టితో సత్యాన్ని గ్రహించుకో.

మ॥ ధరలో సర్వచరాచరంబులకు నా దైవంబొసంగెన్ గదా
స్థిరమై యొప్పెడు యూర్ధ్వ దృషి, ఒక నా దేవుండు నీ యోగ్యతన్
30 దెలియం జూచియె యిచ్చియుండెడు నధోదృష్టిన్ సునాయాసమై
దురితాంబోధి మునింగి చచ్చుటకు నీ దుష్కర్మచే చిత్తమా!

ఓ చిత్తమా· ఆ సృష్టి కర్తయైన భగవంతుడు యీ జగత్తులో సర్వ చరాచర జీవకోటికి స్థిరంగాఉండే ఊర్ధ్వ దృష్టిని ప్రసాదించాడుగదా। కాని, నీ యోగ్యతను బరీక్షించటానికో అనురీతిగా, నీ దుష్కర్మచేత సులభంగా అఘ సముద్రంలో బడి మునిగి నశించటానికి నీకు అధోదృష్టిని యిచ్చాడనుకుంటాను.

శా॥ క్రిందన్ బ్రాకెడు వేళ్ళ స్వార్థరహితోత్కృష్ట ప్రభావంబులున్,
గ్రిందన్ శీర్షము నుంచు మానిగల యుత్కృష్టాత్మ భావంబులున్
31 గ్రిందన్ బాఱు నదీ వినిర్మల మహోత్కృష్ట ప్రకాశంబులున్,
గ్రిందన్ జూచియు నీకు గల్గవుగదా కీర్తింపగా చిత్తమా!

ఓ చిత్తమా! క్రిందనుండియు ఊర్ధ్వంగా ప్రయాణం చేసి మ ఆదర్శాన్ని వ్యక్తం చేసేవి ఎన్నో లోకంలో ఉన్నాయి.

చూడు: చెట్టు వేళ్ళుక్రింద ప్రాకుతూ, నిస్వార్థంగా వృక్షాన్ని పెంచుతాయి: మునివర్యులు తల్లక్రిందులుగా తపస్సుచేసినా వారి భావాలు ఉన్నతంగా ప్రసరిస్తాయి. అదేవిధంగా నదీమతల్లి నిర్మలంగా క్రింద ప్రవహిస్తూ, ఆవిరి రూపంలో మరల పైకెగసి, మానవాళికి వర్షాన్ని యిస్తున్నది. వీటిని క్రిందగా చూస్తున్నప్పటికి వాటి ఉత్కృష్టతను నీవు కీర్తించలేక పోతున్నావుగదా:

శా॥ పైకిన్ దుఃఖము దోచు, లోగనినచో ప్రాపించు నానందమే
ఏకాంతస్థితి సాధనాజనిత సద్వ్యాత్తాంతపుల్ వీని నీ
12. వేకాగ్రస్థితి బొందగల్గుదువు, నీకింకేల భీరుత్వముల్
పైకిన్ దోచెడి రూపు గాంచకుమదే పైపూతయే చిత్తమా:

ఓ చిత్తమా: భ్రష్టత్వానికి కారణం గ్రహించావా ఈ లోకంలో బాహ్యరూపాన్ని చూడకు. పై మెరుగేయిదంతా: పైకి కష్టంగా ఉండినా అంతరంగంలో ఆనందం ప్రాప్తిస్తుంది. సాధనాజనితమైన సద్విషయములను శ్రవణంచేసిన నీవు ఏకాగ్రతిని పొందగలవు. ఇక నీకు భీరుత్వం ఎందుకు:

॥ పూతన్ జూచి యథార్థమంచుగన నొప్పున్ భ్రాంతిచే
నీకు. యీ
రీతిన్ దుఃఖము సౌఖ్యమౌ. సుఖము వర్తించున్
మహాదుఃఖమై,
13 యీ తత్త్వంబు నెరుంగ చాల సులభంబేగాని సాధింపగా
జేతన్ గాదతికష్టమై తనరుటన్ జింతింపవే చిత్తమా:

ఓ చిత్తమా! కాని నీ భ్రాంతిచేత పై పూతలు నీకు యథార్థంగా కనిపిస్తాయి. అనగా దుఃఖల సుఖంగా, సుఖం దుఃఖంగా ప్రవర్తిస్తాయి ఈ తత్త్వాన్ని గ్రహించటం సులభ సాధ్యమేగాని సాధించటం మాత్రం చాల కష్టం అని గ్రహించుకో.

ఉ॥ మాటల బొద్దుబుచ్చు పతిమంతులకున్, జిరకాల సాధనా
పాటన మొందియున్న బుధవర్యులకున్ సులభంబు, భేదమా॥
34 మాటలు కోటదాటునను మాట నెరుంగవె? వీరిదింతయే॥
ఆటలు వారి కాత్మవిషయాలన సాధనచేత చిత్తమా॥

ఓ చిత్తమా? ఈ లోకంలో యీ తత్త్వ విషయాలు ఇరువురికి సులభంగా కనిపిస్తాయి. ఒకటి అచరణ శూన్యులై మాటలతో కాలం గడిపేవారికి సులభం. రెండు చిరకాలంనుండి సాధనా పటిమను పొందిన బుధవర్యులకు సులభం వీరిరువురికి ఎంత వ్యత్యాసము ! మాటలు కోటలు దాటుతాయి అనే సూక్తి తెలుసునా? సాధనచేత ఆత్మ విషయాలతో ఆడుకుంటారు మహాత్ములు.

శా॥ నీకాధారము బాహ్యలోకమనుచున్ నీవెంచబోకమ్మ, ము
ల్లోకాలన్ భరియించు తత్త్వమదె నీలో నున్నదో యమ్మ॥ !
3౹ శ్లోకస్థానము నొందజేయు గుణముల్ లోనున్నవో యమ్మ, విన్
దాకన్ జాలునె లోకపాశములు సత్యంబమ్మరో! చిత్తమా॥

ఓ చిత్తమా! నీకు బాహ్యలోకం ఆధారమని తలంచకు. మూడు లోకాలను భరించు తత్త్వం నీ లోపలనున్నదమ్మా॥

ఉత్తమ స్థానమును పొందించు సద్గుణ సంపద నీలోనున్నదమ్మా!
ఈ లోకపాశాలు నిన్ను చేరగలవా? నిజమమ్మా!

ఉ॥ అందగరాని బాహ్యపు సహాయము గోరగనేల నమ్మ, నీ
కందుచునున్న లోని సుఖదాయక శక్తుల చిక్కు నుంచి, నీ
36 వొందగబూను యాత్మ వెలినున్నదె! లోనికి దిగి చూచు
కొమ్మ! ఈ
చందము తప్పు దోవ దిగి సత్యము గోల్పడవద్దు
చిత్తమా!

ఓ చిత్తమా! నీ లోపలనుండి, నీ కందుచుండిన సుఖప్రద మైన శక్తుల గాంచక, నీకు అందనట్టి యీ బాహ్య సహాయము నెందుకమ్మా కోరతావు? నీవు పొందనున్న ఆత్మ బాహ్యంలో ఉన్నదా? ఒక్కసారి లోనికిదిగి చూచుకో! ఈ విధంగా తప్పుగా ప్రయాణించి, సత్యాన్ని పోగొట్టుకోవద్దు.

శా॥ ఆరోగ్యంబె శరీరదార్ఢ్యమగు, ధీ యౌన్నత్యమే బుద్ధి కా
ధారంబైన బలంబు, నాత్మబలమున్ స్థాపించు సత్సాధనం,
7 బీ రీతిన్ త్రివిధాల శక్తి గనినన్, హేయంపు సంసారమున్
ధీరత్వంబున గెల్వ జీవితము శాంతిన్ బొందునో చిత్తమా!

ఓ చిత్తమా! శరీర దృఢత్వమే ఆరోగ్యం. బుద్ధియొక్క ఔన్నత్యమే బుద్ధికి ఆధారమైన బలం. ఆ బలమే ఆత్మబలాన్ని స్థాపించే సత్ సాధనం. పైరీతిగా మూడు విధాలుగా శక్తిని సంపాదించి, ధీరత్వంతో నీచ సంసారమును గెలిచిన జీవితము శాంతిని పొందును.

చ॥ జరిగిన దానినే తలచి శాంతిని గోల్పడరాదు; యిప్పుడే
జరుగుచునున్న దాని గని సాక్షివలెన్ వమవృత్తినుండుమా!
38 జరుగగనున్న దాని మనసా స్మరియించి తపింపవద్దు, యీ
స్థిరమతి బొందుచో నదియె క్షేమపదంబు విముక్తి చిత్తమా!

ఓ చిత్తమా! జరిగినదానిని తలచుకొని శాంతిని పోగొట్టుకోకూడదు. ఇప్పుడు జరుగుతున్నదానిని సాక్షివలె చూస్తూఉండు. జరుగబోవు దానిని స్మరించి తపించవద్దు. అనగా భూత భవిష్యద్వర్తమాన కాలంలో విషయాలను స్మరించక, స్థిరత్వాన్ని పొందాలి. అదియే. క్షేమస్థితి. విముక్త స్థితి.

శా॥ దూరాలోచన జూడుమెద్ది నిను నీ దుశ్చింతలన్ ముంచు? 'ఛీ
ప్రారబ్ధం'బని 'పాడు దైవ' మనుచున్. పాపిష్టి
లోకంబు నా
39 నీ రీతిన్ దురపిల్లుటే! విదితమౌ హృద్దుర్బలత్వంబులన్
బారన్ దోలగరాదె? శక్తి యరుదే! భ్రాంతిల్లుటే చిత్తమా!

ఓ చిత్తమా! ఈ దుశ్చింతలలో నిన్ను ముంచునది ఏదో కొద్దిగా దూరాలోచన చేసుకో! 'ఛీ ప్రారబ్ధం' అని 'పాడుదైవం' అని, 'పాపిష్టిలోకం' అని అనటంలోనే నీ హృదయ దుర్బలత్వం వ్యక్తం అవుతున్నది. ఆ దౌర్బల్యాన్ని పోగొట్టుకోలేవా? నీకు శక్తిలేదా?

చ॥ పదుగురగూడియుండ దలపన్ వలదమ్మ, జనించునాడు
పదుగురతోడ రావుగద! ప్రాణము వీడిననాడుగూడ ఆ

40 పదుగురు రారు నీ వెనుక: బాంధవబుద్ధిని నీవు దాల్చినన్
పదుగురు రారు నిన్గలిసి వ్యర్థపు భ్రాంతిని వీడు చిత్తమా!

ఓ చిత్తమా! పదిమందితో కలిసి ఉండాలని నీవు భావింప వద్దు. పుట్టిననాడు ఆ పదుగురితో కలిసి రావటంలేదు. అంతే కాదు. ప్రాణం పోయిన తరువాతకూడ ఆ పదిమంది నీ వెనుక రారు. బంధువులు అనేబుద్ధి నీకున్నను ఎవరును నీ వెంటరారు. అందుచేత అనవసరపు భ్రాంతిని త్యజించు.

చ॥ అదియునుగాక సర్వజగమంత సృజించి భరించి దుర్గించు శ
క్తిదిగద లోకరక్షణము! దీని నెరుంగక లోక తారణం
41 బెద గలదంచు నీవు భ్రమియించుట గూడదు, దాన
నీదు శాం
తిదమగు జీవితంబునకు దీవ్ర విఘాతము గల్గు జిత్తమా!

ఓ చిత్తమా! అహంకారం పనికిరాదుసుమా! జగత్తును సృజించి, పోషించి, లయింపజేసే ఆదిశక్తిది లోకరక్షణ బాధ్యత దీనిని గ్రహించక, నీవు లోకాన్ని తరింపజేయగలననే భ్రమను పొందరాదు. దానివలన నీ శాంతియుతమైన జీవితానికి తీవ్రమైన ...బ్బ కలుగుతుంది! నీవు శాంతిని కోల్పోయి అశాంతిపాలవు ...వుసుమా!

చ॥ అనుదినమాత్మశిక్షణమునందు మునింగి, యనుక్షణంబు జీ
వనమును శుద్ధిజేయుచు నవశ్యము ధ్యాననిమగ్నమొంది శో

42 ఘనమగు బ్రహ్మమందు మను భవ్యచరిత్రు గరంబు
మండదే
గుణవిభవోత్తమానుభవకోటి యదెంతటిదైన చిత్తమా!

ఓ చిత్తమా! నిత్యము ఆత్మ శిక్షణలో మునిగి, అనుక్షణం జీవనాన్ని పరిశుద్ధ పరచుకొనుచు, సదా ధ్యాననిమగ్నతపొంది, ఆనందప్రదమగు బ్రహ్మమునం దుండిన పూత చరిత్రులచేతిలో ఎటువంటిదైనను, ఆ ఉన్నతగుణసంభరితమైన ఉన్నత్య ఉత్తమ అనుభవకోటి నివసిస్తుంది సుమా!

ఉ॥ చిత్తమ! నీ చంచలత్వము నశింపగ బై వచియించివట్టి యీ
యుత్తమ భావజాలముల నుత్సుకతన్ దినచర్యనుంచి లో
43 కోత్తర దీక్షబూన గలవా? పరమానుభవౌఘ సంస్థితా
యత్త విశాలశాంత మధురామృతపానముగల్గు చిత్తమా!

ఓ చిత్తమా! నీ చంచలత్వం పోవటానికి పైన వచించిన యీ యుత్తమ భావసమూహాన్ని ఉత్సాహంతో నీ దినచర్యలో పాటించటానికి లోకోత్తరమైన దీక్షను పూనుకోగలవా? ఆ దీక్షచేత పరమానుభవ సంస్థితికలిగి, దానిచే నీ విశాల శాంతమధురామృ పానం చేయగల్గుతావు. చపలత్వం పోవాలిసుమా!

చ॥ చనవున బాలబాలికల సన్నిధిజేర్చుచు నాడినావు! పై
వనితలతోడ నెయ్యమున భవ్యసుకర్మల జేసినావు! క్రి
44 న్నన బురుషాళితోగలసి నాణ్యముగా జరియించినావు! ఈ
యనుభవమెల్ల జాలదె! పరాశ్రియమెందుకు వెర్రి
చిత్తమా!

ఓ వెర్రిచిత్తమా! బాల బాలికలను దగ్గరకుచేర్చి ఆడుకున్నావు, తర్వాత స్త్రీలతోకలసి అనేక మంచికర్మలనుచేశావు. పిదప పురుషులతో చక్కగా కలసితిరిగావు. ఈ అనుభవాలన్నీ చాలవా? ఇక పరుల నాశ్రయించటం దేనికి?

ఉ॥ చేసితివన్న దానముల, జేసితి పెద్దల సంగతిన్, గడున్
జేసితి గ్రంథపాఠముల, జేసితివింక నసంఖ్య సత్కృతుల్.
45 జేసినవెల్ల జాలవె! విశేషముగా శ్రమజెంది యిట్టులీ
వేసట నిచ్చు కార్యముల వీడుము శాంతి గడింప జిత్తమా!

ఓ చిత్తమా! అన్నదానాలు చేశావు. పెద్దల సాంగత్యం చేశావు. గ్రంథపాఠాలను చదివావు అనేక సత్కార్యాలు చేశావు. గ్రంథపాఠాలను చదివావు. అనేక సత్కార్యాలుచేశావు. ఈ చేసినవన్నీ చాలవా? ఈ విధంగా అధికంగా శ్రమజేశావు. శాంతి గడించదలచినచో ఇక యీ శ్రమతో కూడిన కార్యములను వదలుము.

ఉ॥ సుంతయు జంకులేక జెడుచుంటిరొకండనుమాత్రముంటి నా
స్వాంతములోన నెంచి, సువిచక్షణదృష్టి యభావమౌట! నా
46 వంతయు సందులేక జగమంతట నిండుచు దేవుడుండ, నే
కాంతము గల్గునే యెచటనైన మరెవ్వరికైన జిత్తమా!

ఓ చిత్తమా! ఒక్కడనే మాత్రమే ఉన్నానని మదిలో భావించి, వివేకంలోపించుటచేత, ఏమాత్రం జంకులేక చెడిపోతారుసుమా! సర్వ ప్రపంచంలో సర్వత్ర వ్యాపించి, భగవంతుడుండగా యిక ఎవరికైన ఏకాంతం అనేది కలుగుతుందా?

శా॥ ఏ కాంతంబుననుంటినంచనుచు దుష్కృత్యంబులన్ జేసినన్
లోకాంతర్గతవర్తి యీశ్వరుడు తా లోనుండి వీక్షింపడే?
47 ఏకాంతంబనునట్టిదే భ్రమసుమా దృగ్గోచరాతీతుడై
నీ కార్యంబుల జూచు సాక్షి యతడై నిక్కంబుగా జిత్తమా!

ఓ చిత్తమా! ఏకాంతంలో ఉన్నానని భావించి, చెడుపను లను చేస్తే లోకాంతర్గతవర్తి అయిన ఆ యీశ్వరుడు లోనుండి చూస్తుంటాడుగా! ఈ బాహ్యదృష్టికి అగోచరుడై, నీవు చేసే పనులను చూచేసాక్షి యథార్థంగా ఈశ్వరుడే. అందువలన ఏకాంతం అనేదే భ్రమసుమా!

చ॥ ఎరుగనిదానిగూర్చి మనమెంతయినన్ బలుకంగవచ్చు, నీ
వెరిగినచో వచించుటలదృశ్యములౌ నిదియే రహస్య; మా
48 యెరిగినవారు మౌనముసుమీ! మరి వర్ణనసేయుచుందు రీ
యెరుగనివారు గొప్పగ, నిదే భ్రమ యీ ధరలోన చిత్తమా!

ఓ చిత్తమా! తెలియనిదానిగూర్చి మాటలలో ఎన్ని అయినా వచింపవచ్చును. కాని యథార్థ తత్త్వాన్ని గ్రహించినచో యిక మాటలులేవుసుమా! ఇదే పరమరహస్యం. తెలిసినవారు మౌనం వహిస్తారు. తెలియనివారు మాత్రం అనేకవిధాలుగా, చా గొప్పగా వర్ణిస్తుంటారు. ఇదే యీ లోకంలో భ్రాంతి.

శా॥ మౌనంబే పరమార్థ సాధకము సన్మౌనాన సర్వంబు స్వా
ధీనంబౌ నిది సత్యమౌనసుమ! నీ ధీరత్వమున్ యోగ్యతల్

49 దీనన్ బ్రస్ఫుటమౌను, కాక జగతిన్ ధిక్కారమున్
జేయుచో
గానంరాదిక శాంతి, మూఢు పగిదిన్గా నెంతునే చిత్తమా!

ఓ చిత్తమా! మౌనం పరమార్థ సాధనం. యథార్థ మౌనం చేత సర్వం స్వాధీనం అవుతుంది. ఇది సత్యం. నీధైర్య స్థైర్యములు, యోగ్యతలు యీ మౌనంలో తెలుస్తాయి. అట్లుకాక యీ ప్రపంచాన్ని ధిక్కరించుచో అసలు శాంతియే పృగ్యాం అవుతుంది. అది మూఢత్వంగా పరిణమిస్తుందిసుమా!

ఉ॥ లొంగుటకాదు మౌనమన, లోక జయంబది,
యింద్రియంబులున్
భంగము నొందు మౌనమున, భావవిభూతియు
వృద్ధి పొందు, ను
50 ప్పొంగెడు నాత్మశక్తి, యఘపుంజము నాశమునొందు,
గాన నే
భంగినినైన దీని సముపార్జన ముఖ్యముగాదె చిత్తమా!

ఓ చిత్తమా! మౌనం అంటే ఏమిటో చెప్పుతానువిను. మౌనం అంటే లొంగటంకాదు, లోకాన్ని జయించటం. ఈ మౌనంలో యింద్రియ సమూహం భంగం పొందుతుంది, భావాభివృద్ధి కలుగుతుంది, ఆత్మశక్తి ఉప్పొంగుతుంది. పాపసంచయం నశిస్తుంది. ఇటువంటి యీ మౌనాన్ని ఏ విధంగానైనా ఆర్జించటం ముఖ్యంగదా?

చ॥ ఇది విడరాని సాధన, మహిన్ గల సర్వమతాలకున్ సుఖ
ప్రదమగు మార్గరాజము, ప్రభావయుతంబు, ఫలంబు వెంటనే
51 యొదవును ప్రస్ఫుటక్రియ, ఇక యోచనలేల ధరింపు మౌనమున్
సమలతత్త్వ యోగము సద్గతి గల్గు నీకు చిత్తమా!

ఓ చిత్తమా! ఈ మౌనం ఎంతకాలం అనే ప్రశ్నలేదు. ఎల్లప్పుడూ పాటించవచ్చు. ఈ లోకంలో ఉన్న సర్వమతాలకు సుఖాన్ని ప్రసాదించు రాజమార్గము, ప్రభావంతో కూడుకున్నది. సద్యోఫలితాన్ని ప్రసాదిస్తుంది. కాన యిక నీవు ఆలోచించక నిర్మల తత్త్వయోగమైన మౌనాన్ని ధరించు. దానిచేత నీకు సద్గతి లభిస్తుంది సుమా!

మ॥ అతిసూక్ష్మంబుగ దాగు దుర్గుణసమూహంబున్ బలత్కార నం
గతితో వెలిబుచ్చి దున్మించి సతము కళ్యాణమున్ గూర్చు, యీ
52 ప్రతిలేనట్టి పథంబు మౌనమును నీ ప్రావీణ్యతన్ బూనుమా
స్తుతిపాత్రంబిది సమ్మతంబిది మహాశోభాఢ్యమై చిత్తమా!

ఓ చిత్తమా! ఈ మౌనం, మనకు తెలియకుండ అతి సూక్ష్మంగా లోపల ఉండే దుర్గుణ సమూహాన్ని బలవంతంగా బయటకుతోసి, నశింపజేస్తుంది. ఎల్లప్పుడు కల్యాణాన్ని చేకూరుస్తుంది. ఇటువంటి ఎదురులేని మార్గమైన మౌనంలో ప్రావీణ్యతను సంపాదించుకో! శోభాసంయుక్తమైన జీవితాన్ని పొందుకో!

అనేక సంస్తుతులకు పాత్రమైనదీ. యీ మౌనం. యోగ్య మైనది.

చ॥ మననము వృద్ధిగాంచ నగు మౌనము, ధ్యానము దానినుండియే
జనితము, ధ్యానజన్యముగ సంభవమౌను సమాధి, దానితో
53 జను వెను వెంట మోక్షమను సత్యమునే గ్రహియించి, మౌన సా
ధన శ్రేష్ఠతన్ దెలిసి దాని ధరించి చరింపు చిత్తమా॥

ఓ చిత్తమా! మననం అభివృద్ధిచెందితే మౌనం అవుతుంది మౌనంనుండి ధ్యానం పుట్టుతుంది. ఆ ధ్యానంనుండి సమాధి కలుగుతుంది. ఆ సమాధితోడనే మోక్షం అనే యధార్థాన్ని గ్రహించుకో. దానిని ధరించి సంచరించు.

మ॥ తులలేనట్టి యఖండశక్తి యిక నీతో నైక్యమై యొప్పు, రం
జిలు బ్రహ్మద్యుతి నీముఖంబున యశశ్శ్రీ నాట్యమాడంగ, శో
54 భిలు నీ శక్తి ప్రపంచమంతటను గంభీరస్థితిన్, గాన ని
ర్మల మౌనవ్రతదీక్ష బూనుమిక నీ లక్ష్యంబుగా చిత్తమా॥

ఓ చిత్తమా! మౌనంవలన అతులమైన అఖండమైన శక్తి లభించి, నీలో లీనం అవుతుంది నీముఖంలో బ్రహ్మ తేజస్సు చిప్పిలుతుంది. యశస్సు నాట్యం చేస్తుంది. ప్రపంచ మంతట నీ శక్తి గంభీరంగా ప్రకాశిస్తుంది. కావ యీ నిర్మల మౌనాన్ని నీ ఆదర్శంగాభావించి. యిక మౌనవ్రత దీక్షను పూనుకో.

మ॥ సుచిరంబైన యథార్థ సంస్థితులలో శోభిల్లి మోదింప నెం
చుచు దీవ్రంబుగ బ్రహ్మచర్యమున దృష్టుల్
బెట్టలేకున్న నీ
55 టిచె క్షేత్రంబును నింపబూని తగు గట్టే గట్టుకున్నట్లు లౌ
టచె చెల్విం గని బ్రహ్మచర్యమున నుండన్ బూనవే
చిత్తమా!

ఓ చిత్తమా! ముఖ్య విషయం చెప్పుతానువిను పొలాన్ని నీటిచే నింపబూనిన రైతు, చుట్టూ గట్టు కట్టక, ఎంతకానికైనా పొలం నింపలేనట్లుగా శాశ్వతమై, యధార్థమైన ఆత్మ సంస్థితులలో శోభించి, ఆనందించాలంటే తీవ్రంగా నీ దృష్టిని బ్రహ్మచర్యం మీద నిలపకున్నచో ప్రయోజనం శూన్యం. అందుచేత బాగా గ్రహించుకుని బ్రహ్మచర్యాన్ని సక్రమంగా పాటించ టానికి పూనుకో!

శా॥ ఆర్యుల్ గొందరు బ్రహ్మచర్యపద వాక్యార్థంబునే
చూచి, యూ
కార్యానన్ గల సౌఖ్యమున్ దెలియకన్ గాబోలు,
వాకొందు రే
56 చర్యన్ బ్రహ్మమునందు నుంట యని! మోక్షార్థంబుకై
యెట్టి స
త్కార్యంబుల్ గనవో యెరుంగకయె పల్కం
జూతురో చి

ఓ చిత్తమా! ఆ బ్రహ్మచర్యంలో ఉండే కొంతమంది, బ్రహ్మచర్య పద అర్థాన్నే స్వీకరించి, అందలి యథార్థ ఆనందాన్ని

తెసుకొనలేకనేమో 'బ్రహ్మంలో చరించటం బ్రహ్మచర్యం' అని చెప్తూ యుంటారు. కాని మోక్షం పొందటానికి ఏటువంటి సత్కార్యాలు ఉన్నవో తెలుసుకోక వారు ఆ విధంగా మాట్లాడుతుంటారు సుమా.

చ॥ అగునగు బ్రహ్మచర్యమన సాంతము బ్రహ్మమునందు
వాసమే
యగు, నిజమున్ గ్రహింప, విషయంబులు
శూన్యములై యశక్తులై
67 తగునటులాత్మశక్తి పరతంత్రములై చెలరొందఁ బట్టి రీ
తిగ నిక బ్రహ్మచారి జగతిన్ విషయాల మునుంగు చిత్తమా!

ఓ చిత్తమా! పూర్తిగా బ్రహ్మంలో నివసించటమే బ్రహ్మచర్యం అవుతుంది. యథార్థం ఆలోచిసే యీ బ్రహ్మచర్యంలో విషయాలు పూర్తిగా నశిస్తాయి. శక్తిహీన మౌతాయి. ఆత్మశక్తి అధీనంలో ఉంటాయి. ఈ విధంగా విషయములన్నీ నశించిన నిక బ్రహ్మచారి లోకంలో లౌకిక విషయాలలో మునగటం అసంభవం.

౯॥ అర్థంబున్ గ్రహియింపనెంచి పద వాక్యార్థంబులన్ వాని ల
క్ష్యార్థంబున్ క్రమరీతి నేర్చి, పిదపన్ గాంక్షించు
తత్త్వంబులన్
68 సార్థంబై హృదినుంచి యాచరణమున్ సాధింపగా నెంచుచో
సార్థక్యంబు నొసంగు, సాధన యగున్ సత్యంబుగా చిత్తమా!

ఓ చిత్తమా! అర్థాన్ని గ్రహించేటప్పుడు, పదముయొక్క, వాక్యం యొక్క అర్థాలను, వాని లక్ష్యార్థాలను సక్రమంగా నేర్చుకొని, తరువాత తాను కాంక్షించిన ఆత్మతత్త్వాన్ని అర్థయుక్తంగా హృదయంలో నిలుపుకొని, దాన్ని ఆచరణలో సాధించటానికి పూనుకోటమే అర్థయుక్తమైన సాధన అవుతుంది. ఇది యదార్థం సుమా!

చ॥ ద్వివిధము బ్రహ్మచర్యమగు వీర్యనిరోధమునన్ బలంబు పొం
ది విమల చిత్తమున్ గనుటదీ ప్రథమంబగు, నంత బ్రహ్మమున్
9 దవిలి యనంత సౌఖ్యగుణతత్పరతన్ గనుటే ద్వితీయమౌ.
నవిరళమైన సాధనతో, సాధ్యము సిద్ధముగాదె చిత్తమా!

ఓ చిత్తమా! ఈ బ్రహ్మచర్యంకూడ ద్వివిధంగా ఉన్నది. వీర్య నిరోధంచేత బలాన్ని ఆర్జించి నిర్మల చిత్తాన్ని పొందటం మొదటిది. తర్వాత బ్రహ్మతత్త్వాన్ని గ్రహించి, బ్రహ్మమే తానై, అనంత ఆనంద సంపదలలో తాదాత్మ్యాన్ని పొందటం రెండవది. అవిరళమైన సాధనచేత తప్పక సాధ్యం సిద్ధిస్తుంది సుమా!

ఉ॥ దానికి సాధనల్ బలువిధంబుల నుండునుగాని యేది దే
హానికి బుద్ధికాత్మకు బునాదిగనుండెడు యింద్రియంబునే
10 పూని యెజస్సు జేయుచు నపూర్వ వికాసము గల్గజేయునో,
దానిని బ్రహ్మచర్యమన ధర్మము నమ్ముము దీని జిత్తమా!

ఓ చిత్తమా! దీనికి అనేక విధములైన సాధనలు ఉన్నవి. కాని ఆత్మ జ్ఞానానికి, ఏది దేహానికి, బుద్ధికి, ఆధారమైన ఇంద్రియాన్ని ఓజోరూపంగా మలిచి, అపూర్వ వికాసాన్ని కలిగిస్తుందో అదియే బ్రహ్మచర్యం అనటం ధర్మం. దీన్ని యథార్థంగా విశ్వసించు.

చ॥ అదియొకదాని నీవు సముపార్జన సల్పిన బ్రహ్మతేజమే
హ్మాది తనువాత్మలందు గడు శ్రేష్ఠత జిందులు
దొ్రక్కు, సాధ్య సం
61 పద యగు సర్వసాధనలు. ప్రాప్తము శాంతియు,
శ్రేష్ఠమై సుఖ
ప్రదమగు బ్రహ్మచర్యమను పావనసువ్రతదీక్ష చిత్తమా!

ఓ చిత్తమా! ఈ ఒక్క బ్రహ్మచర్యాన్ని నీవు శ్రమజేసి ఆర్జించినచో నీ శరీరంలో, నీ హృదయంలో, ఆత్మలో ఆ బ్రహ్మ తేజస్సు అధికంగా చిందులు త్రొక్కుతుంది. సకల సాధనలు సుసాధ్యం అవుతాయి. శాంతి లభిస్తుంది. అందుచేత యీ బ్రహ్మచర్యం అనేది శ్రేష్ఠమై, సుఖప్రదమై, పవిత్రమైన, చక్కని దీక్షగా భావించు.

। మనమున మోహనాశనము మాన్యత జేయును
బ్రహ్మచర్యమే!
మనమును లొంగదీయు ఘనమంత్రము సూత్రము
బ్రహ్మచర్యమే!
62 మననము వృద్ధినేసి మతిమంతుని జేయును బ్రహ్మచర్యమే!
మనకిక బ్రహ్మచర్య బలమాత్రముచేతనె ముక్తి చిత్తమా!

ఓ చిత్తమా! మనస్సులో ఉన్నమోహాన్ని చక్కగా వశింపజేసేది యీ బ్రహ్మచర్యమే! మనస్సును స్వాధీనం చేసుకొనే గొప్ప మంత్రము, సూత్రము యీ బ్రహ్మచర్యమే, మనసాన్ని అభివృద్ధిచేసి ధీ సంపన్నతను కలిగించునది యీ బ్రహ్మచర్యమే! ముక్తికూడ యీ బ్రహ్మచర్య బలంచేత మాత్రమేసుమా!

ఉ॥ చాలము బ్రహ్మచర్యమును సల్పెడు ధన్యుని శక్తి బోల్పగా,
జాలము బ్రహ్మచర్యఘనసారవిలోలజసౌఖ్యమెంచగా,
63 జాలము బ్రహ్మచర్యసముపార్జన గల్గు ప్రకాశమెన్నగా,
జాలము బ్రహ్మచర్యమను సాధన సిద్ధి గణింప జిత్తమా.

ఓ చిత్తమా! ఆ బ్రహ్మచర్యాన్ని సక్రమంగా పాలించు ధన్యుని శక్తిని దేనితో పోల్చలేము. ఆ బ్రహ్మచర్యసారంలో మునిగినవాని సౌఖ్యాన్నిగూడ లెక్కించలేము. అబ్రహ్మచర్య పాలనచేత గలిగిన ప్రకాశాన్నిగూర్చి వచింపలేము, అబ్రహ్మచర్యం అనేసాధనచేత లభించు సిద్ధాను గణించలేము,

శా॥ పైలోకంబును దుర్వించి, నిశ్చల మతిన్ భావించి లోలోక స
త్యాలన్, వాని జయించ గానవగు ద్వంద్వాతీతమౌ స్థానమున్
64 కాలంబాది నిమిత్త దేశములు లేకన్ వెల్గుమూర్తిన్ మహా
జ్వాలా శక్తిని స్వీయరూపమును శోభాస్వాంతితో జిత్తమా.

ఓ చిత్తమా! పరలోక ఆసక్తివదీసి, నిశ్చలత్వాన్ని పొంది, లోక విషయాల గ్రహించి, ఆచరించి చరించినచో దేశ కాల నిమిత్తములపై ప్రకాశించు దివ్యమూర్తిని, మహాతేజో శక్తిని, స్వస్వరూపమును, ద్వంద్వాతీతమైన స్థానాన్ని శోభాయమానంగా పొందగలవుసుమా!

మ॥ సులభత్వంబు వరింప గష్టమగు, నీ సౌఖ్యంబున్ ద్రోసినన్
సులభంబౌగద మోక్షమార్గము, సదా సౌఖ్యంబునే గోరకన్
65 గలలోనైనను కష్టమంచనక లక్ష్యార్థంబులో మున్గి, నీ
చలనత్వంబును వీడి దుంకినగదా సంతోషమౌ చిత్తమా!

ఓ చిత్తమా! సులభంగా దొరికేవి లోక విషయాలు. ఈ సులభత్వాన్ని త్యజిస్తే మోక్షమార్గం సులభంగా లభ్యం అవుతుంది. సుఖాన్ని అపేక్షింపక, స్వప్నంలోనైనా కష్టంగా భావింపక, లక్ష్యసాధనలో మునిగి, నీ చపలత్వాన్ని వీడి దూకితేగదా నీకు సంతోషము ప్రాప్తిస్తుంది.!

శా॥ దీనిన్ గాంచక సౌఖ్యమున్ వలచి, తృప్తిన్ గాంచ యోచించి మా
ర్గానన్ దుంకి, సుఖంబుదూరమగు ప్రారంభంబు వీక్షించి, యా
66 శానాశంబున దుఃఖమొంది, యుభయస్థానంబులన్ బాసి లో
కానన్ భ్రష్టతనొందువారి గనవే జ్ఞానార్థివై చిత్తమా!

ఓ చిత్తమా! ఈ రహస్యాన్ని గ్రహించలేక, సౌఖ్యాన్ని వాంఛించి, తృప్తిపొందాలని భావించి, మార్గంలో ప్రవేశించి, త్వరగా సుఖంలభించకుండుటచే చింతించి, ఆశావినాశంచేత దుఃఖాన్ని పొంది, ఉభయభ్రష్టులై లోకంలో ఎంతమంది ఉన్నారో చూడు! జ్ఞానాన్ని అర్థించే నీవు యీ స్థితిని గ్రహించుకో.

ఉ॥ సూత్రము చెప్పువాడ, విను సూక్ష్మముగా మతినుంచి, దీన నే
మాత్రములేవు యోగములు, మంత్రము లేదు, జపంబు సున్న, యే

87 యాత్రయు లేదు, లేవిచట నాసన కర్మలు నిష్ఠలంచు, నీ
సూత్రము కష్టమై మిగుల శుద్ధవివేకయుతంబు చిత్తమా!

ఓ చిత్తమా! నీకు సూత్రం చెప్పుతున్నాను, విను. సూక్ష్మంగా వుంటుంది. శ్రద్ధగావిను. దీనిలో యోగంలేదు, మంత్రంలేదు జపంలేదు. యాత్రలేదు. ఆసనాలులేవు. కర్మలులేవు. నియమ నిష్ఠలు లేవు. ఈ సూత్రం శుద్ధ వివేకంతో కూడుకున్నది, కష్టాతి కష్టమైన దిసుమా!

చ॥ తెలియగ గష్టమంటినని దీనత బొందకుమమ్మ, దీని నే
సులభముగా నెరుంగ నొక సూత్రము దెల్పెద, దాని నమ్మి ని
88 శ్చలమంగ జేయుడేని యిది సాధ్యము, పైనిది నిన్వరించి, విన్
బలువిధ సౌఖ్యచంద్రికలపై నటియింపగజేయు చిత్తమా!

ఓ చిత్తమా! తెలియటం కష్టం అన్నానని నీవు భయపడ కమ్మా! దీన్ని సులభంగా తెలిసికొనే సూత్రాన్ని నీకు తెలియ జేస్తాను. దాన్ని నమ్మి, నిశ్చలంగా ఆచరిస్తే అన్నీ సాధ్యం అవుతాయి. అప్పుడు ఆ స్థితి నిన్నుచేరి, నిన్ను సౌఖ్య చంద్రిక లలో ముంచుతుంది.

చ॥ వలసిన వస్తువుల్ వెలిలొ బ్రాప్తము కానివి, చిత్తసీమలో
దొరకుట, లోకమెందులకు? దూరమొనర్పుము! నీకు దానితో
89 గలుగదు లాభమింతయిన, కాన తలంచి, వివేకముంచి, నా
పలుకుల నాలకించి, నడువన్ సుఖమొందెదవమ్మ చిత్తమా!

ఓ చిత్తమా! నీకు కావలసిన వస్తువులు బాహ్యంలో దొరకవు. చిత్తంలో లభిస్తాయి. ఇక లోకం దేనికి? లోకాన్ని దూరం చేసుకో! నీకు ఆ లోకంతో లాభం కలుగదు. కాన ఆ విషయాన్ని గ్రహించి, వివేకంతో నా మాటల నాలకించి నడచినచో సంతోషాన్ని పొందుతావమ్మా!

మ॥ 'ఇది యిట్లుండును, కాదు వే'రనుచు నీవీరీతి యోచించచో
నది 'యిట్లుండదు వేరు గా'దనుచు సర్వాతీతమై యొప్పెడున్!
70 'ఇది ఎట్లున్నది' యంచు నిర్మలమతిన్ హృద్వీధి వీక్షింప నె
మ్మది ప్రత్యక్షముగాదె యాత్మ నిజధర్మంబొప్పగా చిత్తమా!

ఓ చిత్తమా! 'ఇది యీ విధంగా ఉంటుంది, వేరు కాదు' అని నీవు ఆలోచించినచో 'అది యీ విధంగా ఉండదు. వేరు కాదు' అని సర్వాతీతంగా ఉంటుంది, 'ఇది ఏ విధంగా ఉన్నది' అని నిర్మలంగా హృదయవీధిలో వీక్షించిన, నిజధర్మంతో ఆత్మ ప్రత్యక్షం అవుతుంది సుమా!

ఉ॥ ఇంతకు బాహ్యమున్ మరచుటే ప్రథమంబగు దీన; దానితో
స్వాంతమునందు నమ్మకము శక్తియు గల్గును, పైన సాధనల్
71 శాంతవిధాన సాగు, నిజ శక్తిని నమ్ముట మోసపోక ని
శ్చింత జరించి పొందెదవశేష సుఖప్రదముక్తి చిత్తమా!

ఓ చిత్తమా! అసలు దీనిలో బాహ్యాన్ని మరచిపోవటమే మొదటిది. దానిచేత లోపల విశ్వాసం, శక్తి కలుగుతవి. తర్వాత సాధనలు శాంతంగా సాగిపోతాయి తన శక్తిని గ్రహించుకొంటంలో కూడా మోసం లేకుండ చూచుకున్నచో

నిశ్చింతగా చరించుచు అనంత సుఖప్రదమైన ముక్తిని పొందెదవు సుమా!

మ॥ క్షణమైనన్ విడరాదు, దీని గురులక్ష్యంబుంచ ముఖ్యంబు, కా
క నణుప్రాయము సందు యేర్పడిన, మాయాశక్తి లో జొచ్చి, త
72 క్షణమే ధ్వంసమొనర్చు సర్వమును, ఈ కార్యంబు కష్టంబు కా
వున నేర్పొప్ప మెలంగి, విస్మరువకే ముఖ్యంబుగా చిత్తమా!

ఓ చిత్తమా! ఒక్క క్షణంకూడ దీన్ని దూరం చేయకూడదు. ముఖ్యంగా దీనియందు గొప్ప లక్ష్యం ఉంచాలి. లేనిచో అణుప్రాయమైన ఏమరుపాటు కలిగినను మాయాశక్తిలోన ప్రవేశించి, సర్వాన్ని నాశనం చేస్తుంది. ఈ విషయం చాల కష్టం, కావన నేర్పుగా మెలగుచు, ముఖ్యంగా నిన్ను మరిచి పోవద్దుసుమా!

మ॥ అగుటన్ నిత్యము సాధనానియతి శ్రేయస్కామిపై యున్న. జే
రగ రాజాలునె దుష్టభావములు ధైర్యంబొప్పగా! గాంచి విన్
73 జగమే కంపము జెందు నీ పరమ తేజచ్ఛ్రీని గాంచంగ, ఇ
పుగ నాత్మైక్యము చేతనుండునుసుమా పూర్ణంబుగా చిత్తమ

ఓ చిత్తమా. నిత్యం నియమబద్ధమైన సాధనలో శ్రేయస్కామి పై యున్నచో, ఏ ధైర్యంతో నిన్ను దుష్టభావములు ఏ విధంగా చేరతాయి? నీ పరమైన తేజశ్రీనిచూడటానికి లోకమే కంపిస్తుంది. నీదగ్గరలో పరిపూర్ణంగా ఆత్మైక్యము ఉంటుంది సుమా!

మ॥ 'బలహీనేన న లభ్యమాత్మ' యను సద్వాక్యార్థమిచ్చోటనే
చెలగున్, బుద్ధి శరీరమాత్మబలముల్ శ్రేష్ఠంబుగా బొంద, ప్రా
74 ప్తిలు సామర్థ్యము నాత్మశక్తి యట, నాత్మీయంపు విశ్వాసమున్
గలుగున్ సిద్ధులు కీర్తులున్ ప్రతిభ మోక్షార్థంబులున్ చిత్తమా!

ఓ చిత్తమా! శరీర, బుద్ధి, ఆత్మ బలములలో 'నాయమాత్మా బలహీనేన లభ్యః' అను వాక్యార్థములో ఆత్మబలమే శ్రేష్ఠమను విషయం సువ్యక్తం. ఆత్మ శక్తి ఆత్మ విశ్వాసం, సామర్థ్యములు అక్కడ ప్రాప్తిస్తాయి. అప్పుడే మోక్షార్థం సిద్ధులు, కీర్తులు, సర్వం లభిస్తాయి.

ఉ॥ చేయగలట్టి శక్తి గని జేయకయున్నను జాలు ధాత్రిలో,
గాయము నెంచకుండ క్షణకాలము బాయక శక్తి జూపుచున్,
75 జేయవలెన్ బ్రధానమగు చింతల సాధన నాత్మ బొందగా,
నీ యుపయుక్త మార్గము గ్రహింపుమవశ్యము వెర్రిచిత్తమా!

ఓ వెర్రిచిత్తమా! లోకంలో శక్తిని సంపాదించి ఏమియు చేయక, లోపముల నెంచక, క్షణంకూడా మరువక, ఆత్మను పొందుటకు ముఖ్య విచారణ శక్తితో జేయుచు, సాధన సలుపవలెను. వెంటనే యీ ఉపయోగకరమైన మార్గాన్ని గ్రహించుకో.

॥ జాగ్రత జాగ్రతంచు బలుసారులు పేల్కొలుపుల్ బఠించుచున్
అగ్రిము జేరుదాక ధనువంతట జాగ్రత మారుమ్రోగ నీ

18 యుగ్రతపం బొనర్పుము మహోత్తమ దీక్ష ధరించి,
మించి, ఏ
కాగ్రత ప్రజ్వలింప నిదియేసుమ సాధన వెర్రిచిత్తమా!

ఓ చిత్తమా! 'జాగ్రత జాగ్రత' అని అనేక పర్యాయములు మేల్కొలుపులు పలికిస్తూ, శిఖరం చేరేవరకు శరీరమంతటా జాగ్రత మాట మోగించుకుంటూ. ఉత్తమ దీక్షతోమించి, ఉగ్రతపస్సును చెయ్యి. ఏకాగ్రత ప్రజ్వలింపజేసికో! ఇదే సాధనసుమా!

ఉ॥ హెచ్చుగ విద్య నేర్చినను దృష్టిని సాధన నుంచకున్నచో
మెచ్చడు దేవుడున్, జగతి మేలనదే, యనుభూతిలేక నే
11 మిచ్చెదివమ్మ భక్తులకు హీనదశన్ బడియుండి? గల్గునే
బిచ్చపుగాడు బిచ్చమిడ? వీడుము భ్రాంతిని వెర్రిచిత్తమా!

ఓ వెర్రిచిత్తమా! అధికంగా విద్యనేర్చినా సాధనపై దృష్టిని నిలపనిచో భగవంతుడు మెచ్చుకోడు. ప్రపంచంకూడా యిష్టపడదు. నీవే హీనదశలో, అనుభవములేక ఉంటే యిక భక్తులకు నీవేమి యివ్వగలవు? యాచకుడు యాచకునికి ఏమివ్వ గలడు? కాబట్టి అటువంటి భ్రాంతిని దూరం చేసుకో!

శా॥ గ్రంథజ్ఞానము వ్యర్థమంచనను, ఆ గ్రంథస్థమౌ భాషనే
యంధత్వంబున స్వీకరింపకయె, భాషాతీతమౌ భావ సం
18 బంధంబున్ గని దాని మార్గమున బోవన్ బూనుటే
దివ్యమౌ
బంధచ్ఛేదకమైన సాధన యదే భాష్యంబగున్ జిత్తమా!

ఓ చిత్తమా! గ్రంథజ్ఞానం అనవసరం అని చెప్పను కాని ఆ గ్రంథస్థమైన భాషను గుడ్డిగా స్వీకరించవద్దు. భాషాతీతమైన భావసంబంధాన్ని గ్రహించి, ఆ మార్గంలో ప్రయాణం చేయటమే దివ్యమైన బంధ వినాశకమైన సాధన సుమా! అదే భాష్యం అవుతుంది.

ఉ॥ శక్తికిమించు సాధన యశస్సులకో, యవివేక మొందియో,
శక్తిని ధారవోయుటిక జాలును తీవ్రపు చింత జేసి నీ
౹౹ శక్తి నెరింగి సాధ్యమగు సాధన బూనుము, నీకు దానిచే
శక్తి సుఖంబు డెందమున శాంతియు గల్గుగదమ్మ చిత్తమా!

ఓ చిత్తమా! సాధనలో కొన్ని విధానాలున్నవిసుమా! అవివేకంతో, కీర్తికోసం శక్తికి మించిన సాధనచేసి, శక్తిని ధారపోయటం మంచిదిగాదు. నీ శక్తిని గ్రహించుకొని, తీవ్రంగా ఆలోచించి, నీకు సరిపడు సాధననే సాగించుకో. నిదాచేత నీకు శాంతి, సుఖం. హృదయంలో శాంతి లభిస్తాయమ్మా!

ఉ॥ అందని మానిపండ్లకొరకై పరువెత్తుటగాదె! యిట్టి నీ
కందని సాధనానియతి? అందు ప్రయోజనమేమిటమ్మ! ఆ
౬౦ నందము లేక విభ్రమమునందు మునుంగుదువమ్మ! కావు నీ
చందము శక్తికిన్ దగిన సాధన మంచిదిగాదె చిత్తమా!

ఓ చిత్తమా! నీ శక్తికిమించిన సాధనచేయటం అందని చెట్టు పండ్లకోసం పరుగులు వేయటం వంటిదని గ్రహించుకో. దీనివలన నీకు ప్రయోజనం ఏమిటి? ఆ శక్తికి మించిన సాధన ల

చేత అనందించలేకపోగా భ్రమలో మునిగిపోతావు. కాబట్టి నీశక్తికి తగిన సాధనా విధానం చాలా మంచిది సుమా!

ఉ॥ యోగము మంచిదే, జపము యోగ్యము, ధ్యానముగూడ శ్రేష్ఠమే
త్యాగము సత్తమంబు, భజనాదులు సైతము మంచివేసుమా!
81 బాగుగ విద్య నేర్చుటయు బాడికు, గాని మనంబు సాధనా
యోగనిమగ్నమైనగద యొప్పును సాధనలంచు చిత్తమా!

ఓ చిత్తమా! యోగం మంచిదే. జపం యోగ్యమైనదే. ధ్యానంకూడా శ్రేష్ఠమే. త్యాగం ఉత్తమంసమా! భజనాదికాలు మంచివే. చక్కగా విద్యనభ్యసించటం మంచిదే. కాని మనస్సు సాధనా యోగంలో నిమగ్నం అయితేగాని సాధన కాదుసుమా!

ఉ॥ కాన వివక్షణాపరతి గామమడంచి మహేశు శుద్ధచి
త్తాన బ్రతిష్ఠ జేసి, నిరతంబు నహీనచరిత్రనున్న, సు
82 జ్ఞానవిభూతి నాత్మ గననౌనని నమ్ముము, సాధనా నియో
గాన జరించి యుండుమిక గాల మమూల్యమునుమ్ము చిత్తమా

ఓ చిత్తమా! కాబట్టి వివక్షణా జ్ఞానంతో కామాన్ని అణచి శుద్ధ చిత్తంలో మహేశ్వరుని ప్రతిష్ఠించి, నిత్యం పవిత్రజీవనం సాగించినచో, సుజ్ఞాన విభూతియైన ఆత్మను పొందగలమనినమ్ము. కాలం అమూల్యం అయినది. కాబట్టి యిక నియమబద్ధమైన సాధనలో సంచరించు.

ఉ॥ చేయుట సేయనేర్పునను శిష్టపదంబుల లక్ష్యముంచకన్
జేయక జేయనేర్పుమని జేరిన బెద్దల లాభమున్నదే?
83 చేయుటదెట్టులంచు మది జింతిలుచుండిన జింత దీరునే?
చేయుచు బట్టుతో మరల సేయుట సాధనయౌను చిత్తమా!

చిత్తమా! 'చేయుట చేయించుట నేర్పును' అను మరచి సూక్తుల నిర్లక్ష్యముజేసి, ఏమియుచేయక, చేయటం నేర్పమని పెద్దలజేరిన ప్రయోజనమేమున్నది? లేక 'చేయటం ఎట్లు?' అని చింతిస్తూ ఉంటే చింతలు తీరుతాయా? పట్టుదలతో మరల మరల చేయటమే సాధన అవుతుంది సుమా!

ఉ॥ సాధన యన్న నేమి! కడు జాగ్రత నాత్మపరీక్ష సేయుటే
సాధన, దోషమున్న సువిశాలమనంబున సంస్కరించుటే
84 సాధన, మార్గమందు దన స్థానమెరుంగుచు మించ జూచుటే
సాధన, సాధనంబున నసాధ్యము సాధ్యముకాదె చిత్తమా!

ఓ చిత్తమా! అసలు సాధనంటే ఏమిటి? చాల జాగ్రత్తతో ఆత్మ పరీక్ష చేసుకోటమే సాధన, దోషం ఉంటే విశాల మనస్సుతో దానిని సంస్కరించటమే సాధన. మార్గంలో తనస్థానాన్ని గ్రహించుకుంటూ మించి పోవాలనేదే సాధన. సాధనచేత సాధ్యము సాధ్యము చేసుకోవచ్చును సుమా!

॥ ఏ కార్యంబుల జేసినన్ బలికినన్ హృద్వీధి యోచించినన్
'నీకున్ దాని ఫలంబుగా గలుగునే నిక్కంపు మోక్షార్హతల్?
85 చేకూరంగలదే ముదం'బని సదా చింతించి తీవ్రంబుగా
నేకాగ్రస్థితినుంట సాధనసుమా యింతేలనో చిత్తమా!

మ॥ సులభత్వంబు వరింప గష్టమగు, నీ సౌలభ్యమున్ ద్రోసినన్
సులభంబౌగద మోక్షమార్గము, సదా సౌఖ్యంబునే గోరకన్
65 గలలోనైనను కష్టమంచనక లక్ష్యార్థంబులో మున్గి, నీ
చలనత్వంబును వీడి దుంకినగదా సంతోషమౌ చిత్తమా!

ఓ చిత్తమా! సులభంగా దొరికేవి లోక విషయాలు. ఈ సులభత్వాన్ని త్యజిస్తే మోక్షమార్గం సులభంగా లభ్యం అవుతుంది. సుఖాన్ని అపేక్షింపక, స్వప్నంలోనైనా కష్టంగా భావింపక, లక్ష్యసాధనలో మునిగి, నీ చపలత్వాన్ని వీడి దూకితేగదా నీకు సంతోషము ప్రాప్తిస్తుంది!

శా॥ దీనిన్ గాంచక సౌఖ్యమున్ వలచి, తృప్తిన్ గాంచ యోచించి మా
గ్గానన్ దుంకి, సుఖంబుదూరమగు ప్రారంభంబు వీక్షించి, యా
66 శానాశంబున దుఃఖమొంది, యుభయస్థానంబులన్ బాసి లో
కానన్ భ్రష్టతనొందువారి గనవే జ్ఞానార్థివై చిత్తమా!

ఓ చిత్తమా! ఈ రహస్యాన్ని గ్రహించలేక, సౌఖ్యాన్ని వాంఛించి, తృప్తిపొందాలని భావించి, మార్గంలో ప్రవేశించి, త్వరగా సుఖంలభించకుండుటచే చింతించి, ఆశావినాశంచేత దుఃఖాన్ని పొంది, ఉభయభ్రష్టులై లోకంలో ఎంతమంది ఉన్నారో చూడు! జ్ఞానాన్ని అర్థించే నీవు యీ స్థితిని గ్రహించుకో.

ఉ॥ సూత్రము చెప్పువాడ, విను సూక్ష్మముగా మతినుంచి, దీన నే
మాత్రములేవు యోగములు, మంత్రము లేదు, జపంబు సున్న, యే

ఉ॥ సాధన జాతి వర్ణ మత జాడలెఱంగదు, లింగభేద దుర్
బాధల పొంతబోదికను, ప్రాయ విచక్షణ చేయబోదు, నీ
88 ధీ ధన ధాన్యసంపదల ధీరత జూడదు, గాని నీదు హృత్
శోధన నాశ్రయించి మనుచుండును బానిసభంగి చిత్తమా!

ఓ చిత్తమా! ఈ సాధనలో జాతి, మత వ్యవస్థలులేవు. స్త్రీ, పురుషులు అను లింగభేదములులేవు, వయస్సు విచారణలేదు. తెలివితేటలు, ధనధాన్య సంపదలను చూడదు. కాని నీ హృదయ పరిశోధన నాశ్రయించి యీ సాధన బానిసవలె నిన్నాశ్రయించి ఉంటుంది సుమా!

చ॥ మడిమయిలాది నీమముల మాటలు లేవిట, జేయు కాంక్షగ
ల్గెడు గడియే శుభప్రదము, కేవల నిర్మల చిత్తముండు టే
89 మడి యగు; దీని మర్మము సమంచితరీతి గ్రహించి చక్కగా
నడచిన సాధనం దురిది నాణ్యవిధానము సుమ్ము చిత్తమా!

ఓ చిత్తమా! ఈ సాధనలో మడి, మైల, అను నియమాలు లేవు. సాధన చేయవలెనని తీవ్రకాంక్ష కలగటమే సుముహూర్తం. నిర్మలమైన మనస్సు ఉండటమే మడి అని అర్థం. దీని రహస్యాన్ని చక్కగా గ్రహించుకొని, చక్కగా నడిచినచో దీనినే సాధన అంటారు. ఇది మంచి మార్గముసుమా!

ఉ॥ చూచుచు జూడనట్లు, వినుచున్ విననట్టుల, లోన దోచియున్
దోచనియట్లు దివ్యగతి దూరపు దృష్టుల గల్గి సాక్షివై

90 చూచుచునుండుచో జగతి శూన్యము దాల్చెడు. నాత్మ సుస్పష్టమై
దోచును, సాధనంబనగ దుష్కరమై సులభంబు చిత్తమా!

ఓ చిత్తమా! ఈ లోకంలో చూస్తూ చూడనట్లుగా వింటూ విననట్లుగా, లోపల ఆలోచించియు ఆలోచించని విధంగా, తీవ్రంగా, దూరదృష్టిగలిగి, సాక్షిపై చూస్తూ ఉంటే లేని జగత్తు లేకుండి నిత్యమైన ఆత్మ సుస్పష్టం కాగలదు. సాధన అనగా మొదట కష్టమై, పిదప సులభంగా ఉంటుంది సుమా!

ఉ॥ సాధనచేతనే గద ప్రశస్త విముక్తి గడించిరా ఋషుల్
సాధనచేతనే యుపనిషత్ ద్యుతి ధారుణి ప్రజ్వలించె, నా
91 సాధనచేతగాదె గనె శక్తిని రాయిలో రామకృష్ణుడున్
సాధనచేత సాధ్యపడజాలనిదెద్దియులేదు చిత్తమా!

ఓ చిత్తమా! సాధనలేనిదే ఏమీ చేయలేము సుమా! మహర్షులందరూ ప్రశస్తమైన విముక్తిని పొందారు యీ సాధనచేతనే! ఈ సాధనచేతనే ప్రపంచంలో ఉపనిషత్ తేజోపుంజము ప్రకాశించింది. ఈ సాధనచేతచే శ్రీరామకృష్ణ పరమహంస దేవుడు జడమైన రాయిలో ఆదిశక్తిని దర్శించాడు. సాధనచేత సాధ్యంకానిది ఏదియులేదు సుమా!

ఉ॥ ఏ గతి భానుబింబముదయింపక పూర్వము స్వర్ణకాంతు లు
ద్యోగముతో జనించి మహితోన్నతి భాస్కరు రాక జాటునో,
92 ఆ గతి స్వాత్మ నమ్మకము అద్భుత భాస్వర కాంతిపుంజమై
రాగ విభూతి నాత్మలయ లక్షణమున్ బ్రకటించు చిత్తమా!

ఓ చిత్తమా! సూర్య భగవానుడుదయింపకముందు కాంతి కిరణములు జనించి, భాస్కరునియొక్క మహిమను, రాకను తెలుపునో అదేవిధంగా ఆత్మ విశ్వాసము తేజోవంతమైన అద్భుత కాంతి పుంజమై వచ్చి, ఆత్మ విభూతిని సూచిస్తుంది.

ఉ॥ సాధన సాధ్యమౌ నిక, విశాలత గల్గు మనంబునందు, నే
బాధలులేక మార్గమిక భాసిలు సున్నితమై, విశాలమై,
9 క్రోధ సమూహమంతమగు. గోరికలెల్ల నశించు, దీనికై
సాధన సల్పుమమ్మ యిక శాశ్వతముక్తి లభించు చిత్తమా!

ఓ చిత్తమా! అప్పుడు సాధన సాధ్యం అవుతుంది. మనస్సులో విశాలత్వం సిద్ధిస్తుంది. ఏ బాధలు లేక మార్గం సున్నితంగా, విశాలంగా ప్రకాశిస్తుంది. కామ క్రోధాదిక సమూహం నశిస్తుంది. కోర్కెలన్నీ అంతం అవుతాయి. దీని కోసం సాధన చేయమ్మా! ఆ సాధనచేత శాశ్వతముక్తి లభిస్తుంది.

చ॥ అనుభవమా? యభావముగదా వెలియందు, మనంబునుండు నా
యనుభవమున్ గడింపగ హృదంతరవీధుల బర్వులెత్తుచో
14 ఘనయము శాంతిధామమున హాయి విహారము సల్పుచుండు! వా
గుణపథమున్ వరించి యదిగో సుఖమున్ గనుమమ్మ
చిత్తమా!

ఓ చిత్తమా! అనుభవమంటే బాహ్యంలో లేదుసుమా! మనస్సులో ఉంటుంది, ఆ యనుభవాన్ని సంపాదించటానికి హృదయాంతర్గత మార్గములందు పరుగులు వేయాలి. అప్పుడు

సదా శాంతిధామంలో హాయిగా విహారం చేయగలవు. ఇక ఆ మంచి మార్గాన్ని వరించి యథార్థ సుఖాన్ని పొందగలవు.

ఉ॥ జ్యోతికి మధ్యమస్థ్నదగు జ్యోతియు, చీకటిలోని చీకటుల్
జేకస తత్త్వమం మగల చేతనశక్తియు, శాంతి శాంతికిన్,
65 ధాతకు ధాతయై వెలగు తత్త్వము సెప్పగ నేరికౌను? ఆ
జ్యోతి నెఱుంగు మార్గమిక నుత్తమసాధనగాదె చిత్తమా!

ఓ చిత్తమా! ఆ యాత్మ జ్యోతులకు జ్యోతిస్సైనది. చీకటికి చీకటియైనది. చేతనత్వంలోని చేతనమైనది శాంతికి శాంతమైనది. స్రష్టకు స్రష్టయైనది, ఇటువంటి ఆత్మను గూర్చి ఎవరు చెప్పగలరు? ఆ జ్యోతిని తెలుసుకొను మార్గమే ఉత్తమ సాధనగదా!

మ॥ వినినావా! కనుమొక్కసారి యట గంభీర ప్రకాశాత్మవై
వివరానట్టి వినిర్మలత్వమున స్థంభీభూతమై శాంతమై
66 అనవద్యంబగు నాత్మసంస్థితులలో నైక్యంబవై బ్రహ్మమం
దు నభేదస్థితి నుండగల్గుదువు సద్యోగంబునన్ చిత్తమా!

చిత్తమా! ఒక్కసారి చూడు! అనవద్యమైన ఆత్మ సంస్థితులలో ఏకత్వాన్ని పొంది, గంభీర ప్రకాశాత్మవై, నిర్మలత్వంలో మునిగి, శాంతమూర్తివై నీవేనాడు వినరాని అభేదబ్రహ్మ సంస్థితులలో సద్యోగంలో ఉండగలవు. విన్నావా?

శా॥ గమ్యస్థానము చెప్పరానిది, మహాగంభీరమై నిత్యమై
సౌమ్యంబై సగుణంబు నిర్గుణమునై సౌఖ్యాబ్ధిసంపూర్ణమై

౪౭ సామ్యస్థానవిహారమై యతులమై శక్తిస్వరూపంబునై
గమ్యస్థానమతీతమై తనరు నగ్రాహ్యంబుగా జిత్తమా!

ఓ చిత్తమా! ఆ గమ్యం ఎటువంటిదో తెలుసునా? ఆ గమ్యము వచింపవీలుకానిది. మహాగంభీరమైనది. నిత్యమైనది. సౌఖ్యమైనది. సగుణమైనది, నిర్గుణమైనది, సంపూర్ణసుఖసాగరమైనది. దానికి సమానమైన మరియొక స్థానములేదు. అతులమైనది, శక్తిస్వరూపమైనది. గ్రహించుటకు వీలుకాని, అతీతమైనది. ఇది గమ్యస్థానం.

చ॥ కనగ వచింపగన్ వినగ గైకొనగన్ జదువంగ దూరమై
తన నిజతత్త్వమందరికి దగ్గరనుంచియు నంటకుండు, న
౪౮ ట్లనుపమ నిర్మలత్వమున నందనిదై యతిసూక్ష్మమై సదా
యనుభవనీయమై తనరు నవ్యమైనది యాత్మ చిత్తమా!

ఓ చిత్తమా! ఆయాత్మ చూడబడదు. వాక్కు వివరించలేదు. చెవులు వినలేవు. చేతితో స్పృశింపబడదు. యోచనకు అందనిది. అందరికి సన్నిహితమైనను అంటనిది. అది అతినిర్మలమగుటచే నందనిది, అతి సూక్ష్మమైనది, అవ్యయమైనది. సదా ఆ యాత్మ అనుభవైకవేద్యమై యగుచున్నది.

॥ అంతట నిండియుండి యఖిలాండములందు వసించుచుండి యా
వంతయు గోచరింపక నియంతగనుండి చరించు నాత్మ, ఏ
౪౯ కాంతమునందు సాధన భయంబుల వీడుచు, జేయు సాధక
స్వాంతములందుమాత్రము విశాంత గోచరమౌను చిత్తమా!

ఓ చిత్తమా! ఆయాత్మ అంతట వ్యాపించియున్నను దృగ్గోచరముకాక నియంతగా ఉండి శాసిస్తుంది. ఏకాంతంలో భయములేక సాధనల సలుపుచున్న సాధకుల హృదయములందు మాత్రము విశాలంగా గోచరిస్తుంది. అదియే ఆత్మ.

ఉ॥ అందును యందకుండును మహద్భుతశక్తిగలట్టి యాత్మ, పు
ట్టొందును పుట్టకుండును మహోన్నతశక్తిగలట్టి యాత్మ, ఆ
100 నందము గల్గి గల్గనిది వర్తనశక్తిగలట్టి యాత్మ, యీ
చందము వింతతత్త్వముల సారము దూరము, ఆత్మ చిత్తమా!

ఓ చిత్తమా! ఆ యాత్మ అంది అందక ఉండే అద్భుతమైన శక్తికలది. ఆ యాత్మ పుట్టి, పుట్టక ఉండే ఉత్కృష్టమైనది. ఆ యాత్మ ఆనందముకలిగి, కలగని వర్తనశక్తిగలది. వింత తత్త్వముల సారము, దూరమైనదిసుమా ఆ యాత్మ!

హరిః ఓం తత్ సత్